# ఉదయతార

కారుమంచి వెంకటేశ్వరరావు.

130

F9706




4వ లైను, బ్రాడీపేట :: గుంటూరు-2.

భువిని స్వర్గంగా;
జీవితాన్ని నందనంగా;
మలచాలనే
మహత్తర సంకల్పంతో
గతంచేత
వర్తమానంలో
హత్యాగావింపబడిన
అమరజీవుల
సమాధుల మ్రోల
యీ
నా
కవితా సుమాలు.

" కారుమంచి "

# పరిచయం

శ్రీ కారుమంచి వెంకటేశ్వరరావుగారు అప్యాయతతో అందజేసిన ఖండకావ్యాల సంపుటి "ఉదయతార" పరికించాను. 1946-52 సంవత్సరాల మధ్య భూస్వామ్య నిరంకుశత్వానికి వ్యతిరేకంగా తెలంగాణాలో ప్రారంభమయి ఆంధ్రదేశమంతటా వ్యాపించిన ప్రజాఉద్యమ తరంగాలను వర్ణించే 13 ఖండ కావ్యాలు యిందులో వున్నాయి. "భువిని స్వర్గంగా; జీవితాన్ని నందనంగా; మలచాలనే మహత్తర సంకల్పంతో, గతంచేత వర్తమానంలో హత్యగావింపబడిన అమరజీవులకు" అంకితమిచ్చారు.

మొత్తంపై పాటలన్నీ చినచిన్న పాదాలతో సులభంగా నడుస్తూ రచయిత చెప్పాలనుకున్న అభ్యుదయ భావాలను శ్రోతలకు వ్యక్తీకరించుతున్నాయి. కాని మొదటి గీతం 'ప్రస్తావన' లో అగస్త్యుడు సముద్రాన్ని అవుపాసన పట్టినట్లుగా మానవ సమాజ పరిణామాన్నంతటినీ వర్ణించాలని ప్రయత్నించడంలో వచన ధోరణిలో నడచిందేగాని పద్యాలలో ప్రదర్శిత మవ్వాలసిన భావోత్సుకత రాలేదు బ్రాహ్మణ శబ్దప్రయోగం సరైన అర్థంలో వాడరా? అని సందేహంవుంది.

భూస్వామ్య నిరంకుశత్వ లక్షణాలను "నమూనా" గీతంలో వర్ణించి, తెలంగాణాలో దోపిడీ విధానానికి చక్కని నమూనా చూపించారు. తరువాత పాటలో 'నిరంతర నికృష్టతలో మెరసిన విద్యుల్లతను బానిస హృదయంలో విరిసిన మందారాన్ని' ప్రజల చైతన్యానికి చిహ్నంగా చూపారు. పాలకులంతా ఏకమయి 'సహింపల రామరాజ్యంలో' ప్రజానీకంపై సాగించిన పైశాచిక చర్యలకు 'కన్నీరు' కార్చారు, జ్ఞానగీతి, మెయిల్ రేస్, అడవాడడవా, పరవేత పగ్గెరా గీతాలలో రైతు కూలీ బిడ్డల వీరత్వాన్ని వర్ణించారు.

గెరిల్లాగా పోరాడుతున్న అన్నను వుద్దేశించి చెల్లి అందజేసే సందేశాన్ని తెలిపేపాట 'అన్నా'. కొడుకుకు "ఆశీస్సులు" పంపే తల్లిపాట చక్కగా వున్నాయి. ఇలాంటి పాటల్లో ద్యోతకమయ్యే అనుభూతి హృదయాన్ని కదిలించగల భావోత్సుకతను తీసికొని రాగలిగినప్పుడే పద్యరచన సార్థకమవుతుంది శ్రీ కారుమంచి వెంకటేశ్వరావుగారు ప్రజా జీవితాన్ని తరచిచూచి, హృదయాన్ని ఉప్పొంగజేసే, మరిన్ని రచనలను వ్రాసి తెలుగు భాషకు సేవ చేస్తారని ఆశించుతున్నాను.

"చంద్రం."

# ప్రస్తావన

ప్లవంగాకృతి
ప్లవం ప్లవం
ప్రకృతిశక్తిలో
విప్లవం;
పరిక్రమించిన
పరిణామం
మానవాకృతి
క్రమ క్రమం.

మాతృత్వ
అగ్రస్థానం
పితృత్వ
పరం పరం.
మస్తిష్కం
మొదటిమెట్టు
అస్తిత్వం
అందుకొంది;

౧

అందరికీ
అందనట్టి
కొందరికే
అందునట్టి
విజ్ఞానపు
పలుబడి

అజ్ఞానంపై
అధికారం;
ప్రజాస్వామ్య
పథకంలో
బ్రహ్మనేత
బ్రాహ్మణుండు.
వానిపల్కు
వేదరుక్కు
వానిఆజ్ఞ
*బ్రహ్మరాత
మంత్ర తంత్ర
మంత్రాంగం
మతాధిప
మహాయుగం
మంత్రోచ్చాటన
మహాశకం.

౨

జాతిసంఖ్యా
పెరిగిపోయె
జాతివలస
తరలుచుండె.
భూమికొరకు
పోరువచ్చె
భువిని యుద్ధం
ఉద్భవించె
యుద్ధ లాఘవ
మాక్రమించె
జాతి జీవన
జీవనాడిని,
కాయపుష్టి
కత్తి బిగువు

దండనత్వాపు
దండిశక్తి
ఆక్రమించెను
ఏలుబడిని
వీరగాథలు
కవితజొచ్చె
వీరపూజలు
వ్యాప్తమయ్యె
వారి స్మారక
చిహ్నములుగ
గుళ్ల గోపురా
లొచ్చినిలచె
"వీరభోజ్యం
రాజ్య" మన్నది
సంక్రమించెను
వారసత్వాం

రాజు పొందెను
దైవ భావం
రాచరిక వాద
మహాయుగం
రాతి బొమ్మల
మహాశకం.

3

రాజు సొమ్ములు
రాళ్లపాలు
చెమటు కాల్వాలు
నేలపాలు
లాభ బేరం
శెట్టిపాలు
విపణి వీధికి
వన్నెహెచ్చె

మనుజ శక్తికి
మహిమ తగ్గె
యంత్రశక్తికి
విలువ వచ్చె
గనులు
కార్ఖానాలు వెలసె
గుత్త సంస్థలు
కుదురుకొనియె
శ్రీల కలిమికి
వీలుచిక్కె
రాజ్య తంత్రము
లోనజొచ్చె
యుద్ధమందున
యంత్రమొచ్చె
భుజ బలానికి
పాటుతప్పె

పాల సంద్రుని
ముద్దుబిడ్డ
మాయవాగుర
మహితశక్తి
కాల మాటువు
తోడబుట్టువు
చీరె చెరగును
బట్టు ఘనుడో:
వాని భావుక
బానిసీడో:
ఏలు రాజ్యం
ఏర్పడిందది
ధనికవాద
మహాయుగం
కనక కామిత
మహాశకం.

౪

రాజరికం
రాజ్యామేలు
ధనికవాద
చ్ఛాయలలమె.
ముందు యుగపు
తొలి సంధ్యల్లో
మునగానాం
తేలానాం.

* బ్రహ్మ అనగా ఆదిమ సమాజంలోని గణము

# నమూనా

శెట్టిగారి యింట్లో
సమస్తమైన
సరంజామా -
అయ్యగారి యింట్లో
విందుకు సంభారం -
వీధినిడొల్లే
గున్నకాయానికి
నాటించాక
సూక్ష్మ కంటకం
మంగలివాని వీపు
తాషామర్పాకు వీలుగా
ఏర్పాటు జరిగింది.

చాకలి పేరడి
రెక్కలు
వింజామర్ల
బరువుతో
కన్నకొడుకును సైతం
కాపుటించి ఎరుగవ్.
అచ్చోసిన
ఆబోతుల
తరతరాల
కామతృష్ణ
సిడియాడిన
హృదయాలను
లెక్కించుట
ఎరికిశక్యం?
తాత తీసుకొన్న
తూముడు గింజలకు

మనమడు కూడా
నౌకరీ చేస్తే
ఉన్న కుంచెడుభూమి
గాలికి
కర్పూరమైంది.
గ్రామాధికార్ల
పొలాలకు
గట్టురాళ్ల గుర్తు
మచ్చుకైనా
లేకుండా పోయింది.
భయపూరిత
హృదయంతో
"బాంచెనోణ్ణి బాంచా
నీపాదాల మొక్కుతా"
అన్ని ప్రశ్నలకు
అదే సమాధానం

మొఖాసాదారు
మామూళ్లకు
పటేలుగారి ఆవర్జాలు
కట్టిన
తహసీలు తప్పీలకు
రశీదు ఉండదు.
నవాబు దర్జాకు
నమూనా
యింతే.

# ఏకత్వం

నిత్యా జీవితంలో
నిరంతర నికృష్టత
ఘనఘనా వృతంలో
మెరిసిందో విద్యుల్లత -
బీనిస హృదయంలో
విరిసిందో మందారం -
మూగబాధలోంచి
మ్రోగిందో శంఖం -
వెలిమబ్బుల
తొలివర్షం
ఒలికించిదో
చిన్నజల్లు

సమీరు డరుదెంచి
సుగంధాన్ని విరజిమ్మాడు -
*బ్రహ్మకణాలు శబ్దాన్ని
భారీగా మోశాయి -
మోడువారిన
జీవితాంకురం
మళ్లీ మొసులెత్తింది -
అణచబడ్డ
హృదయకోశం
ఆవేశంతో
కదలాడింది -
మూలవిరాట్టుకు
ముక్కుగోళ్లదిరాయి -
ఉత్సవ విగ్రహాలు
ఊళ్లొట్టుకు
బయలుదేరాయి -

## ఉదయతార

ఉదయార్కుని
మూయడానికి
మూకుళ్లు
వెదుకసాగాయి -
మంత్రాంగపు
యంత్రాంగం
పాత మంత్రాలు
వల్లించింది -
పగడ్బందీగా
కిరణాలను
పట్టి బంధించాలంది -
పెట్టిన చీకటికొట్టల్లా
వెలుతురుతో
వెల్లివిరిసింది !
పెంపుడు కుక్కలకు
మేతేసి గొలుసులు విప్పింది !

మసీదులోనమాజు
ముప్పూటా జరిగింది !
ఆలయంలో
సహస్రనామార్చన
సక్రమంగా జరిగింది !
అల్లా
రాం
ఏకత్వంలో -
గడ్డం
పిలకా
ముడిపడ్డాయ్.

* శబ్ద ప్రసారక కణములు

# కన్నీరు

శోక వృక్షపు
నీలినీడా
నాల్గు చెరగుల
వెల్లివిరిసింది -
దానవత్వపు
ప్రళయ నృత్యం
మానవత్వం
మంటగలిపింది -
దండతాడన
బండబూతులు
జీవితానికి
నిత్యమయ్యాయి -

భర్త ఎదుటనె
భార్యాశీలం
రాక్షసేచ్ఛకు
ఆహుతయ్యింది -
మధుర లాలస
హృదయతంత్రీ
మొక్కవోయి
మూగవోయింది -
గర్భశోకం
మానభంగం
ఏది ఎప్పుడో ?
ఎరుక ఎవ్వరికి ? -
కోతివుండే
బ్రహ్మరాక్షసి
కారమూదిన
కరణి జరిగింది -

కుక్క ముట్టిన
బోనమంటూ
కాయమంతట
నుయ్యి జేరింది
పసరుగాయల
కొరికివేసే
పశుప్రవృత్తి
బుసలు కొట్టింది
పూర్వాకాలపు
పౌండరీకం
వాడవాడల
జరిగితీరింది -
ఆర్యావర్తన
పాతివ్రత్యం
శాసనత్వాపు
చేవ మిగిలింది -

తమ్మి ముడిచిన
కలువ నవ్విన
పంచ ప్రాణాల్
పంచకొస్తాయి -
శబ్దమయ్యిన
భగ్గుమన్నను
మెళ్లోపూసలు
తవిడి చూడాలి -
కొమ్ము పూదిన
కారు మ్రోగిన
అడవులట్టుక
పరుగులెట్టాలి -
పాత రాజ్యాపు
పాతకానికి
తెల్లబోపీ
వెల్లవేసింది -

నిండు ప్రాణాల్
ముండ్లకంపలో
పావకోజ్జ్వాల
కీలరేగింది -
శోకభారం
శిరమువంచగ
మౌనరూపం
ప్రణుతులిచ్చింది -
వేలకొలది
వీర పుత్రుల
అప్పళించీ
అంగలార్చింది -
శోభనపు
పెండ్లింటిలోనా
రాక్షసత్వపు
*గోలి వెళ్లింది -

ఉదయతార

తియ్యా తేనెల
మధుర కలశం
వికల శకలం
హృదయమాగింది -
కన్నె పుష్పిత
తరుణహాసం
కరిగిపోయీ
మరిగిపోయింది -
జీవితాంగణ
ప్రాంగణంబున
బ్రహ్మదండి
మొలచినిలచింది -
మాతృ శోకపు
కంటినీటితో
నదులుపొంగి
గతులు తప్పాయి -

సత్యాహింసల
రామరాజ్యావు
ఆత్మరాముడు
లేచినిలచాడు –

* "బులెట్లు"

# జ్ఞానగీతి

నిత్యం
నిర్బంధంలో
కాలానికి
కట్టవేసి
కత్తుల
పహరాలో
కల్మషాన్ని
గుట్టచేసి
దుర్మార్గం,
దురహంకారం
దానిమీద
తిష్టవేసి

కళ్లకు గంతలుకట్టీ
కర్ణాలకు తాళంబెట్టీ
దేశానికి కళ్లెంపెట్టీ
గతాన్ని పట్టినిల్ప
రాజరికపు
రాక్షసత్వం
మానవ మారణహోమం
హోమకేతు
ధూమశకటం
అదికురిపించే
అగ్నివర్షం
బడబానలాన్ని
బహూకరిస్తే
రోదసీగహ్వారం రోదిస్తే
ప్రభవించిందో !
దివ్యశక్తి.

ప్రసరించిందో !
అరుణకాంతి
కనుపించిందో !
మాతృమూర్తి
వినిపించిందో !
జ్ఞానగీతి
కల్పించిందో !
ఆత్మశక్తి
పూరించిందో !
పాంచజన్యం
కదలించిందో !
యువశక్తి
నిర్మించిందో !
రక్షక వ్యూహం.

# మైల్ రేస్

ఆకు
అల్లాడ్డంలేదు –
ప్రకృతి
నిదురిస్తుంది –
రాబోయ్యే
తుపానుముందు
ఆవహించే
మౌనముద్ర.
గట్టుపై మ్రోగింది
పర్జన్యా శంఖం –
మూలనున్న బరిసె
ముంగలికురికింది –

చెట్టుపై వడిసెల
రుయ్యీ రుయ్యంది
గొడ్డలి
గోద్దలి
మింటు మెరిశాయి –
వీరతిలకం నొసట
వర్ధిల్లి వరలింది –
చెట్టేమొ కదలింది
పుట్టేమొ పలికింది
గుట్టకే కాళ్లొచ్చి
గునగునా
నడచింది –
అగడ్త జూచి
ఆగింది కారు –
మాటులో బర్మారు
"ఢా" మ్మని మ్రోగింది –

అరిదళం బెదిరింది
అల్లాకు మ్రొక్కింది -
రుయ్యంటు రాయొచ్చె
గూబేమొ గుయ్యంది -
బత్తానికొచ్చిన బంటును
బ్రతుకమ్మ పిలిచింది -
పెళ్లాంమెళ్లో సూత్రం
కళ్లల్లో కదలాడింది.
అధికారి
అరమైలు దూరానవుంటం
ఆందోళన
కవకాళమిచ్చింది -
కాళ్లు కదంత్రొక్కాయి -
చమట కాల్వాగట్టింది -
తట్టాబుట్టా గుట్టేసి
మైల్ రేస్ మార్చిజరిగింది -

# అడపా దడపా

అదరింది
గుండె
బెదిరింది
అయినా
ఏరి కూర్చిన సేన
వెడలింది దాడులకు
గ్రామాలకు
గ్రామాలను
గాలించింది
గుడారంపాతి
పీఠంవేసింది.
గాలి కలుషితమైంది

జీవిత ఖాండంలో
విషం కలిపింది.
అదను చూచి
పదునెట్టాల్సిన
సమయం వచ్చింది.
ప్రక్కనున్న అడవిలోకి
చక్కగా తప్పుకున్నాయి
అడపా దడపా
మెరుపు దాడుల్తో
అదర కొడ్తున్నాయి.

# పరవేత

అది ఒక
కాళ రాత్రి
ఇది ఒక
కీకారణ్యాం -
సైన్యాం
చుట్టూ ముట్టేసింది -
ఏ పుట్టలో ఏముందో ?
హృదయంలో
భయముంది.
ఎండాకు గలగలా
గుండెల్లో దడదడా
ప్రతి అడుగూ గడాబిడా

అధికారి గడగడా
బ్రెన్ గన్ ధనధనా
స్టెన్ గన్ టపటపా
అంతాజేసి
యింతా పోతే
చివరికి దొరికిందచ్చట
పీల్చేసిన
సిగరెట్ ముక్కా !
నమిలేసిన
కాయల తొక్కా !!
కడిగేసిన
అన్నపు మెతుకూ !!

## తా మ ర....

ద్రోహ బుద్ధి
గడ్డి కరచింది
దౌష్ట్యాని కొక
ఘన విజయం
ఒక "డెన్ను"
*పగిలింది
కుడి మీసంపై
ఎడమ చెయ్యాడింది.
అహంకారం
విజయ నినాదం చేసింది
లారీ సరుకుతో
నింపబడింది.

అడవి నడుస్తూంది
ట్రైర్లు
తిరుగుతున్నాయి
చెట్టుమీద
ఢాం
డ్రైవరు గుండె
ఠాం
ఎదురుగావున్న
మానవాకృతి
హేండ్సప్ (**Hands up**) చెప్పింది
వన్ (*One*)
టు (*Two*)
త్రి (*Three*)
కారు తేలికిచ్చింది
సరుకు
గమ్యానికి చేరింది

కలతలో
మగత మిగిలింది
కారు హుషారుగా
పరుగెత్తుతుంది
చుట్టూ
తుపాకులు
నోరు
ముయ్యకుండా
నిప్పులు
చెరుగుతున్నాయి -
రోడ్డు ప్రక్క
మైలు రాళ్లు
నిలువునా
కూలాయి !

వీరత్వాన్ని చూచి
పక్షులు
ఫకాలు మన్నాయి !!
సిగ్గుతో
తామర
తలవొంచుకుంది !!!

* రహస్య వస్తువులను దాచు రహస్య ప్రదేశం

# అన్నా!

అన్నా !
నీవెక్కడవున్నా !
నేనెక్కడ దాగున్నా !
విన్నానులే
నీచరితం
విన్నానులే !!
నా హృదయంలో
నిప్పులు పోసి
కళ్లల్లో
పాపలతీసి
ప్రాణంలో
ప్రాణాన్ని

నానావిధాలా
హింసించి
తాళి త్రెంపేసి
నొసటి కుంకమరాల్చేసి
నా కాధారమైన
వృక్షాన్ని
నిలువునా నరికేసిన
దుర్మార్గులు
మొఖాసాదార్
జమేదార్లను
నీగొడ్డలి
కాహారంగా
నా శోకానికి
పరిహారంగా
పుచ్చుకొన్నదన్న
విషయం విన్నా!

ఆత్మశాంతి పొందా.
నీరుణం
తీర్చుకోవడానికి
నీ కడుపున
పుడదామనుకున్నా
కా .... ....
నీ .... ....
ఏంచేయమంటావ్ ?
వ ... ....
ది ... ....
నె .... ....
తలచుకుంటే
.... .... .... ....
గుండె
తరుక్కుపోతుంది
.... .... .... ....

కడుపులో
ప్రేవులు
కళవళపెడుతున్నాయ్
రాక్షసులు....
నరరూప రాక్షసులు...
పశువుల్లా
నరపశువుల్లా ...
వ్రాయలేను
తలచలేను
తలపుల్లోకి వస్తే
అమ్మో! ....
ఆనాటి
ఘటన ....
సినిమా రీలులా
కళ్లల్లో
కదలాడుతుంది.

ఉక్కుమడాల బూట్లు
హృదయంపై
టకటక లాడుతున్న
గుండె
ఆగేటట్టుంది
ఏమైనా
కుక్కలు చించిన
విస్తరై
రక్తపు ముద్దయ్
పిశాచాల
వికటాట్టహాసాలల్లో
కరాళదంష్ట్రల మధ్యా
కనలి
కనలి
ప్రాణం వదలింది

నీరుణం
తీర్చే అవకాశం
నాకు లేకుండాపోయింది.
నీతోపాటు
వద్దా
మనుకుంటే
ఆరోగ్యం
అనుమతించడంలేదు
మీ
వీరత్వాం
గానం చేద్దామంటే
మా
ప్రపంచం
ఆషాఢమాసం
అమావాస్యా

ఉదయతార

మా
గొంతులో
కఫం
గడ్డకట్టి
జీరేసింది
"కష్టే ఫలీ"
అన్నావు నీవు
"కష్ట సుఖాలు
కావడికుండ"
లంటాను నేను.
విన్నాలే !
నీపేరూ
విన్నాలే !!
అదేమో....
బిజిలీఅంటా

అర్థం కాకున్నా
ఎంతందంగావుందీ !
ఇద్దరం
ఏకోదరులమన్న
సంతోషం పొంది
చివరి శ్వాస
పీలుస్తున్నా....
నన్నా -.

# చిచ్చులపిడుగు

సీసా మూతకు
తెరిపే వుండదు
నిషాదిగితే
గుండెలో
గుబగుబ
ఇనుడరిగాడు
కనుమరిగింది
కడుపునిండా
తీర్థం
కదలనంది
శవం.

శవాలపై కప్పిన
మల్లులాగుంది
గుడారం
వచ్చిందో చిచ్చు
వదలిందో *"గ్రెనెడ్"
అయారే!
చిచ్చుల పిడుగూ
అయారే!!
కళ్ల బైర్లు క్రమ్మాయి
మతి చలించింది
అదుగో అంటే
ఇదుగో అంది
ముసుగులో
గ్రుద్దులాట

ఉదయతార

మోకాళ్ల తొలిగాయి
మడాలు విరిగాయి
తుపాకీ కట్టెలు
నోళ్లువిప్పి
"అల్లా - రాం"
అని అరిచాయి
ఎక్కడో
బర్మారు మ్రోగింది
అధికారి హరహరా
మిగిలిన కుచ్చెడు
మాటందించారు
ఠాణాలో
వదలిన సామాను
అడవికి నడచింది.

* చేతి బాంబు

ఉదయతార

# ఆశీస్సులు

అరే
పిడుగా!
నీపేరే
చిచ్చురపిడుగటగా!
బంతిలో
వలపక్షం లేకుండా
మూడుకాళ్ల ముసలినైన
నాకు కూడా
వడ్డించారో
నాల్గు
నడ్డి విరిగి
మంచం మోస్తుంది నన్ను

కన్న కడుపు
పండిందనీ
వీరమాత
నయ్యాననీ
విన్నప్పుడు
వెన్నుబాధ
అరగంటదాకా
గుర్తు రాలేదు
మీతాత రైతైనా?
మీనాన్న కూలైనా?
మూడునాళ్లనాడు
పొరుగింటి పేరమ్మ
ముంతెడు గంజిస్తేం
నీగాధలు వింటుంటే
కడుపు
భరీగా నిండింది.

అందాకా ఉంటానో ?
ఉండనో ??
ధర్మం
జయిస్తుంది !
అలసత్వం
పనికిరాదు
అమ్మ దీవెనలు
బ్రహ్మ దీవెనలై
అండదండలై
విజయాన్నిస్తాయి !!
మీకందరకు
శుభాన్ని కలిగిస్తాయి !!!

# క్రొత్త లోకం

అది ఒక
కట్టులేని పాలకడలి
పీడితలోకపు
దుఃఖాగ్నికి
క్రాగి క్రాగి
పొంగి పొరలి
అన్యాయాన్ని అణచివేసి
సత్యాన్ని నిత్యంజేసి
కష్టానికీ
ఫలితానికీ
మధ్యా మార్పిడి
మనుజకోట్ల
మేటి ముంగిట
గాటు బండిన

జనకరాజుల
కోరలు తీసి
కర్మజలానికి
ఖరీదుగట్టి
తరిగే శక్తికి
సరియగు భుక్తి
పురుషునకే
ప్రకృతిపై అధికారం
జనకునకే
తత్ఫలితపు సుఖభోగం
అందిందది
అందనుంది
అందించుటకున్నిఏడల
ఆందోళన అలుముకొంది

ఉదయతార

క్రొత్తలోక
మవతరించి
నూత్న శక్తి
ఆవహించె -
ఆకాశం
ఆనందాన్ని కురిపించింది -
ప్రకృతి
ఆహ్లాదాన్ని పండించింది -
సీమంతా
క్రాంతిశోభ వెల్లివిరిసింది -



F 9706

అడగగానే 'పరిచయం' వ్రాసి యిచ్చిన
శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావు గారికి (చంద్రం)
యీ రచనకు ప్రోత్సాహమిచ్చిన 'ధనకుధరం'గారికి
నా నమోవాకాలు :-

'కారుమంచి'